సంపుటము 3] సెప్టెంబరు 1916 [సంచిక 3

# బాలమిత్ర




## దిక్సూచక యంత్రము

ప్రియ పిల్లలారా!

దిక్సూచక యంత్రమునుగూర్చి మీకు కొంత చెప్పబోవుచున్నాను. దీనికి ఎలెక్ట్రిక్ బలముగలదు. ఇది అట్టి శక్తిగల యొక కడ్డీయై యున్నది. దానిని మనము ఏ దిక్కునకు త్రిప్పినను ఒకచివర యెల్లప్పుడును ఉత్తరమునకే తిరుగుచుండును. పై పటములో "ఉ" "ద" అని గుర్తువేసినదే ఆ పుడకయై యున్నది. దానికి మరికొన్ని పుడకలుజేర్చి తక్కిన దిక్కులను కనుగొందురు. మన మేదిక్కునకు బోయి

నను, దోవ తెలియక చిక్కుబడినను, దీని సహాయమున మన మేదిక్కునకు బోవుచున్నది దెలిసికొనవచ్చునుగదా.

ఇది మరీ విశేషముగా ఓడలమీద ప్రయాణమై బోవు వారికి మిక్కిలి సహాయకారిగా నుండును. ఇది కనుగొనక పూర్వము నావయాత్ర చాల అపాయకరముగా నుండునది. రాత్రులలో నక్షత్రములను జూచియు, పగలు సూర్యుని జూచియు తెలిసికొనువారు. గాని మబ్బుపట్టి సూర్యచంద్ర నక్షత్రములు కానరానప్పుడు ఏమియును తోచక చిక్కులు పడుచుండువారు. గాని దీని ఉపయోగము తెలిసినమీదట నావయాత్ర మిగుల క్షేమకరమైనదయ్యెను.

దీనివలన మనమొక మంచిబోధను నేర్చుకొనగలము. ఈ యంత్రమున కేలాగున ఎలెక్ట్రిక్ బలముగలదో అదే లాగున మనకును ఒకశక్తి యుండవలెను. అది యీ పుడకపై ఎటుత్రిప్పినను మరల ఉత్తరమునకే వచ్చినిలుచునో ఆలాగు ననే మనమును అట్టి బలమునుకలిగి మన కే యిబ్బందులు ఇక్కట్టులువచ్చినను మనము వాటి నన్నిటిని తప్పించుకొని మన ప్రభువైన యేసుక్రీస్తు వారికి అంటుకట్టబడి యుండ వలెను. మన మిక్కట్టులలో పడినప్పుడు దేవుని నెరుగక ఆయనను దూషించుచుందుము. ఆలాగున చేయక మన మెల్లప్పుడు ప్రభువుతట్టు తిరుగుదము.

అదేలాగున సూదంటురాయి అనునది ఆకర్షణశక్తిచే ఇనుప వస్తువులను, ఉక్కువస్తువులను, తనదగ్గరకు లాగుకొనును.



అదెంత బలముగలదైతే అంతశక్తితో వానిని అంటిపట్టుకొని యుండును. మనలో ప్రేమ ఐక్యము నుండవలెను ఆ సద్గుణములు మనలో నున్నయెడల మనకెవరును హాని జేయజాలరు. 1 కొరింథి. 13 అధ్యాయమును చదువుము.

---

## సూర్యరశ్మి, వర్షము

కమల, కాంత యను ముద్దుబాల లిరువు రొకదినము షికారు వెళ్లదలచిరి. ఆకాశమునం దొక మబ్బైనను లేకపోవుటచే నా దినమునంతయు, తోటలయందు విహ

రించుటయందును పూలు కోయుటయందును వారు గడుపదలచిరి. వర్షము రాకుండుటకై వారు ప్రార్థించుచుండిరి. భోజన సామగ్రినంతను కూర్చుకొనుచున్న సమయమున



వారిలో నొకరికి ఆకసమున చిన్నమబ్బగపడెను. అది త్వరలోనే పోవునని వారనుకొనుచుండ, ఆ చిన్నమబ్బే వృద్ధియై ఆకసమంతటిని నావరించి బోరున వర్షము కురియసాగెను. ముద్దుబాలిక లిద్దరు నిట్టూర్పులు విడుచుచు యేడువసాగిరి. తమ ప్రయత్నములన్నియు వ్యర్థములాయెకదా యని వారెంతయు విచారించ దొడగిరి. షికారుపో నసాధ్యమాయెను కాన వారింటికడనే యుండిరి.

ఆ యుదయముననే సముద్ర మల్లకల్లోలముగా నుండి నందున యీ బిడ్డల అన్నగారు పనిచేయుచుండినయోడ బ్రద్దలైపోయెను. వీరి యన్నయగు విమలయ్యయు మరి కొందరు నొక బల్లచెక్కపై నెక్కి యొడ్డుచేర యత్నించు చుండిరి. సూర్యరశ్మిచే వారి దాహ మధికమాయెను కావున వారు వర్షమునకు ప్రార్థించగా నీ చిన్నమబ్బుగుపడి చిట్ట చివరకు వర్షము కురిసి వారి నాలుకల తడిపి వారి బ్రతికించెను. వారు క్షేమముగ నొడ్డుచేరిరి. విమలయ్య యిల్లుచేరి యీ కథనంతటిని తన సోదరీమణుల కెఱింగించెను. అన్న మాటల వినుచున్న బిడ్డల కన్నులనుండి బొట బొట నీరు గారెను. తమ అన్నగారు వర్షమునకై ప్రార్థించిన సమయముననే తాము సూర్యరశ్మికై ప్రార్థించితిమి గదా యని వా రాశ్చర్యపడి సంతోష భాష్పముల విడచిరి. తమ సంతోషమునకన్న, తమ అన్నగారియొక్కయు అతని మిత్రుల యొక్కయు ప్రాణములు ఘనమైనవైనందున దేవుడు వారి ప్రార్థన నిట్లంగీకరించెనని వారనుకొని, వర్షము కురిసినందులకు సంతసించిరి. మరియు దేవునికి స్తోత్రములు చెల్లించిరి.

# గుఱ్ఱముయొక్క మనవి



నా యజమానుడా! నేను నీకు జేయు ప్రార్థన వినుమని మనవి జేయుచున్నాను. తినుటకు మేతను, త్రాగుటకు నీటిని బెట్టి నావిషయమై తగుజాగ్రతను బుచ్చుకొనుము. సాయంకాలమున నాపని తీరినపిదప, శుభ్రముగాను తేమ లేకుండను ఉండుపరుపును, సుఖముగా పరుండ గలుగుటకు వీలైన వెడల్పుగలశాలను నాకు దయతో ననుగ్రహించుము.

నాయెడల నెమ్మదిగానుండి నాతో అప్పుడప్పుడు మాట్లాడుము. కళ్లెముతో నీ స్వరమును నాకు మార్గదర్శిగా నుండును. నిన్ను బాగుగ సేవించి ప్రేమించులాగున అప్పుడప్పుడు నాతో మురిసికొనుము.

ఎత్తైన ప్రదేశములపైకి బోవునప్పుడు, కళ్లెమునులాగి, చేబుకుతో కొట్టకుము. నీవు కోరినసంగతి నాకు తెలియునప్పుడు, కొట్టి, తన్నకుము. సరిగా గ్రహించుకొన సమయమిమ్ము. నన్ను బాగుగా పరీక్షించి, నీయాజ్ఞ ప్రకారము చేయునప్పుడు నా జీనులోగాని, పాదములలోగాని ఏమైన లోపమున్నదేమో దయచేసి లక్ష్యముంచుము.

వారులను గట్టిగా బిగింపకుము. నా తల నటుఇటు త్రిప్పుకొన వీలుంచనిమ్ము. నేను గంతులు పెట్టుకొన నవసరమని తలంచిన యెడల అవి నాకన్నులను ఒత్తకుండునట్లు కట్టించుము.

ఎక్కువ బరువెక్కించినగాని, వానలో బండికి కట్టిగాని వదలిపెట్టకుము. నాకాళ్లకు లాడము వేయించ మానకుము.

నేను తినునప్పుడు నా పండ్లను పరికించుము. పిప్పిపండ్లేమయిన నున్నవేమో దయతో చూడండి. అవెంత బాధకరమైనవో ఎరుగుదురు. కట్టరాని విధముగా నా తలనెత్తి కట్టకుము. జోరీగలను, దోమలను దులుపుకొను నాతోకను కత్తిరించి నామంచి ఆయుధమును తీసివేయకుము.

నాకు దప్పిక యగుచున్నదని చెప్పజాలను గనుక, తరుచుగా నాకు నీరుపెట్టుము. నాకెండ తగులకుండ నీవు చేయగలిగినది చేయుము. బయలులో నిలువబడి యున్నపుడు నా కేదయినను కప్పుము.

నే నేపని చేయవలెనని కోరుదువో దానిని నేనెంతో సంతోషముతో చేతును. ఎన్నోగంటలు నీకొరకు కాచుకొని నిలువబడుచున్నాను.

చివరగా, నా యజమానుడా, నా బలమంతయు ఉడిగిన తరువాత, ఆకలిచేత మలమలమాడి, చలిచేత వడవడ వణుకుచు చచ్చునట్లుగాని, వదలివేయక చాలకాలమువరకు బాధననుభవించి, తినుటకేమియు ఇయ్యని క్రూరునికి అమ్మివేయకుము. నీ దయచొప్పున నా ప్రాణము తీసివేయుము. అప్పుడు దేవుడీలోకమందును పరలోకమందును నీకు బహుమతి దయచేయును. ఈ మనవులన్నియు, ఒకసాలలో పుట్టిన ఆయన నామమున నిన్ను వేడుకొనుచున్నాను.

---

# ప్రకృతి పాఠములు

## 25-వ పాఠము

### నీవెందుకు శ్వాసించుచున్నావు?

నీవు ఊపిరి పీల్చుచున్నావుగదా! ఎందుకాలాగునచేతువు? దానికి కారణమందరకు తెలిసినదే. ఊపిరించకపోతే బ్రతుకజాలమని అందరును చెప్పెదరు. గాని నీ బ్రతుకుకు శ్వాసించుటేల మిగుల అవసరమై యున్నది?

సిరలగుండ హృదయములోకిబోవు రక్తము నల్లగా నుండు నని చెప్పితిని. అది మంచిరక్తము కాదు. కేశనాళికలలో నుండు నప్పుడది ఎముకలను, చర్మమును, కండలను, నాడులు మొదలగు వానిని వృద్ధినొందించుటలో నుపయోగింపబడినది. అది నల్లగా నున్నంతవఱకు మరల ఆదేలాగున ఉపయోగింప వీలు లేదు. అట్లయితే జరుగవలసిన పనియేది? ఏదో ఒకవిధముగా దానిని మరల మంచి రక్తముగా మార్చవలెను. ఈ పని జరుగు యంత్రశాలయే ఊపిరితిత్తులు.

గుండెలోనికి చెడురక్తము వచ్చినవెంటనే గుండె దానిని ఊపిరి తిత్తులలోకి పంపును. అక్కడది మంచిరక్తమై, శరీరమంతటిలోకి బోవునట్లు గుండెలోనికి మళ్లి ప్రవేశించును. చెడురక్తము మంచిదిగా నెట్లాయెనని నీవడుగవచ్చును. నీవు లోనికిపీల్చు గాలిచేతనే అలాగుమారును. నీవు లోనికిగాలిని పీల్చినప్పుడెల్లను ఆ గాలి రక్తమును మంచిదానిగా మార్చును.

గాలి ఊపిరి తిత్తులలోనికి బోనియెడల, నల్లరక్త మెర్రబడదు. గుండెలోనికది మళ్లిపోయినప్పుడు నల్లగానే ఉండును. అదేలాగున శరీరమంతటి లోకినివచ్చును. ఈ నల్లరక్తము నీవు బ్రతుకుటకు పనికిరాదు. నిన్ను బ్రతికించుట మంచి రక్తముయొక్క పనియై యున్నది. ఎవరైనను నీళ్లలోపడి మునిగిపోయినప్పుడు చనిపోవుదురు. వారికి పీల్చును గాలి లేక

పోయినందున ఊపిరితిత్తులలోని రక్తము మంచిదిగా మారదు. అందువలన చెడినరక్తమే మరల మరల దేహములోనికి బోయి విషముగామారి మనుష్యుని చంపును.




నీరొమ్మునందు గుండెయు, ఊపిరితిత్తులు నున్నవి. ఎడమ భాగమున నొకచోటతప్ప తక్కిన గుండె యావత్తును ఊపిరితిత్తులచే కప్పబడియున్నవి. ఇదిగో ఈ దిక్కున పటమున్నది చూడుము. దానిలో మధ్యనున్నది గుండెకాయ. దానికి రెండుప్రక్కల నున్నవి ఊపిరితిత్తులు. వానిలోనికి గొట్టము

గుండా గాలివచ్చును. ఊపిరితిత్తులు చాల తేలికైనవి. వానిలో చిన్నచిన్న గదు లనేకములున్నవి. ఆ గదుల లోనికి గాలిపోయి వానినింపును. ఈ గదులలోనే రక్తము ఎర్ర బడును.

చేపల ఊపిరితిత్తులనుగూర్చి కొంచెము విచారింతము. చేపలుశ్వాసించవు గనుక వానికి ఊపిరితిత్తు లవసరము లేదని తలంచుచున్నావా? మనవంటి ఊపిరితిత్తులు వానికిలేవు. గాని వానికిని కావలసినట్టి ఊపిరితిత్తులున్నవి. అవికూడా గాలిని పీల్చుకొనును. నీటిలో అవెల్లప్పుడు నుండునుగదా ఏలాగు పీల్చును అని అందువు. నీటిలో చాలగాలి కలిసి యున్నది. చేపల ఊపిరితిత్తులు ఆ గాలిని నీటినుండి వేరు చేయును. దానివలన వాటిరక్తము మారిపోవును. చేపలలోని శంఖులే వానికి ఊపిరితిత్తులు. మనము గాలినిమాత్రము పీల్తుముగాని, చేపలు గాలిని నీటిని పీల్చుకొనగలవు. వట్టిగాలి వానికి పనికిరాదు. నీటితో కలిసిన గాలియే వానికిగావలెను.

ఆకులనుతిని జీవించుచుండు పురుగులను జూచితిరా? అట్టి పురుగులు తరువాత సీతాకోక చిలుకలగును. అవి ఆకులను తినుకాలములో వాని ప్రక్కలందు చిన్నచిన్న నల్లనిమచ్చలు రెండువైపుల నుండును. ఇవి అందముగా నుండినప్పటికి, గాలిని లోనికి బోనిచ్చు రంధ్రములై యున్నవి. పురుగుల

కన్నిటికి సాధారణముగా ఈ నీటిరంధ్రములుండును. వాటి ద్వారానే అవి గాలిని పీల్చుకొనును. అవి మనవలె నోటి గుండను, ముక్కులగుండను గాలిని పీల్చవు.

గాలిని శ్వాసించుటవలన రక్తమున కెంతమేలో చూచితిరి. దానివలన మనకు మరొక మేలుకూడా గలదు. శ్వాసించుటవలన శబ్దముకూడా కలుగును. మనము శ్వాసించని యెడల మాట్లాడజాలము. గొంతుయొక్క చివరను శబ్దము చేయబడును. కొందరికి గొంతులో నొకటి పొడుచుకొని వచ్చినట్లు కనుపడును చూచితిరా? ఇదియొక చిత్రమైన పెట్టె. దీనిలో రెండు పల్చటి చర్మములు అడ్డముగా గలవు. గాలి దీనిగుండా వచ్చునప్పుడాచర్మములు కదలును. అందువలన శబ్దముపుట్టును.

జంతువులలో ననేకములకీ శబ్దము కలిగించు పెట్టె గలదు. ఆవు అంబా అని నప్పుడును, కుక్క మొరిగినప్పుడు, పిల్లి మ్యావు మనినప్పుడు శబ్దమీ పెట్టెలోనే కలుగును.

చేపలకు ఈ పెట్టెలేదు గనుక అవి శబ్దము చేయలేవు. వాటికున్నను అవి శబ్దమును కలిగించజాలవు. ఎందువలన?

నీటిలో మునిగి యున్నంతకాలము కప్పలు బెకబెక మనజాలవు. అవి ఆలాగనవలెననిన, తలను నీటిపైటనుంచవలెను. చేపలకు కప్పలకు భేదమేమి?

# బైబిలు పిల్లలు



మోషే

ఫరోచంపునని పారిపోవుచున్న మోషే పోయిపోయి మిద్యాను ప్రాంతముజేరి, అట నొక బావికడ నిలుచుండెను. అచ్చట కొందరు స్త్రీలు గొఱ్ఱెల మందలకు నీళ్లు తోడి పోయుచుండిరి. ఇంతలో కొందరు పురుషులు వచ్చిరని నీళ్లను తమ మందలకు పెట్టిరి. ఇతరులకు సహాయము చేయుటకు సదా సిద్ధముగానుండు మోషే వారిచేతుల నుండి త్రాడుపుచ్చుకొని తానే నీళ్లుతోడి గొఱ్ఱెలకు నీళ్లు పోసెను. ఆస్త్రీలు ఆనాడు బహుత్వరగా నిల్లుజేరినందులకు వారి తండ్రియైన ఇత్రో ఆశ్చర్యపడి కారణము విచారించి

తెలుసుకొని, తన కుమార్తెలకు సాయముజేసిన విదేశీయుడగు మోషేను ఇంటికి రప్పించుకొనెను. ఆనాటనుండి మోషే, ఇత్రో యింటనే యుండెను. ఇత్రో ఆతని మిగుల ప్రేమించి తన కుమార్తెయగు సిప్పోరా నాతనికిచ్చి పెండ్లిజేసెను. మోషే ప్రతిదినము గొఱ్ఱెల నరణ్యమునకు తోలుకొనిపోయి మందల కాయుచుండెడివాడు. గొఱ్ఱెల మేపుచు, భగవద్సృష్టి వైచిత్రముల మనముల ధ్యానించుచు భగవంతుని సేవించుచుండువాడు. ఇట్లు ప్రతిదినము చేయుచుండ నొకనాడు, ఆతడున్న పర్వత సమీపముననున్న పొద ధగధగయని ప్రజ్వరిల్లుచు నుండుటకాంచి, చిత్రమేమని తెలిసికొనుటకు పొద సమీపమునకు వెళ్లుచుండ “మోషే! మోషే! నీవు నిలుచున్నస్థలము పవిత్రమైనది. నీకాళ్ల చెప్పుల వదలుము”ను శబ్దమువిని, ఆయాజ్ఞప్రకారము చేసెను. అంత వానికి దేవుడు కనుబడి తాను మోషే తాతముత్తాతలు సేవించిన దేవుడనని చెప్పి, ఐగుప్తులోనున్న తన జనాంగమగు ఇబ్రీయుల కష్టములు వారిమొరల నాలకించి వారికి సహాయముచేసి విడుదల ననుగ్రహించి మంచిస్థలమున వారి చేర్చుదునని చెప్పి, మోషే నక్కడకు వెళ్లుమని చెప్పెను. మోషే తనకుగల అసమర్థతను మాటిమాటికి తెలుపుకొన్నను, దేవుడతనినే పొమ్మని మాటిమాటికి ఆజ్ఞా

పించెను. మోషే ప్రభువువలన తన చేతనున్న కర్రతో అద్భుతములు చేయగల శక్తిపొంది ఐగుప్తునకు బయలుదేరి వెళ్లి యటనున్న ఇబ్రీయులకు దైవవిడుదలనుగురించి విశదపరచి తన అన్నయగు అహరోనును వెంటబెట్టుకొని ఫరోకడకు వెళ్లెను. మోషే సకలవిద్యలనేర్చి పండితుడైనను మాటమాంద్యము గలవాడు. ఈకొరతను తొలగించుకొనుటకు బాగుగా మాట్లాడగలిగిన తన సహోదరుని వెంటబెట్టుకొని ఫరోసన్నిధిని సమీపించెను.

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

నాకు యిప్పుడు మీకు పుత్తరము వ్రాయ ఎక్కువ యిష్టముగాయున్నది. ప్రతిమాసము మాఅయ్యవారు కే. సంపోను పంతులుగారు మాకందరికి ఒక్కొక్క పత్రికను యిచ్చుట కలదు. సంగతులన్నియు సులభశైలిలో వ్రాయుటచే అంతయు గ్రహించ గలుగుచున్నాము. ఇచ్చట రెండు పాఠశాలలున్నవి, అవేవనగా మిషన్బడి యొకటి. సర్కారుబడి యొకటి. నేను సర్కారుబడిలో II వ ఫారము చదువుచున్నాను, మిషన్బడిలో నాలుగు తరగతులు మాత్ర

మున్నవి. నాతోటి సహ విద్యార్థులు చాలామంది హిందు వులు, మాబడియందు రెండువందలమంది బాలురు చదువు




చున్నారు. ఇన్ స్పెక్టర్, యస్, జి, వెల్లింకర్, ఎం. ఏ ఎల్, ఎల్ బి, గారు మాపాఠశాలను దర్శించి మాకు ప్రోత్సాహము కలిగించిరి. మొకాలి అమ్మగారిని మాబడిని బాలమిత్రులను సర్వేశ్వరుడు దీవించ ప్రార్థించు మీప్రియ బాలమిత్రుడు.

సి. ఇశ్రాయేలు ఆండ్రు,

హనుమకొండ

C. L. S. PRESS, MADRAS—1916